## ప్రకటన

కడపజిల్లాబోర్డు రూరల్ ఆస్పత్రులలో నెలకు రు. 40/- లు గవర్నమెంటు సబ్‌సిడీ మీద మెటర్నిటీ అసిస్టెంట్లుగా పనిచేయుటకు అర్హతపొందిన మిడ్‌వైఫుల నుండి దరఖాస్తులు కోరడమయినది. 5-8-1957 తేదీని ముందుగా దరఖాస్తులతోపాటు సర్టిఫికెట్లు, రిజిస్టరు కాపీలు కడప జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరువారికి చేరవలయును.

ఎం. ఎస్. చెన్నారెడ్డి,
స్పెషల్ ఆఫీసర్ యొక్క పెర్సనల్ అసిస్టెంటు.
డిస్ట్రిక్టుబోర్డు ఆఫీసు, కడప.
తేది 28 జూలై 1957.







## అస్సాంలో నూనె శుద్ధి కర్మాగారం

### సానుభూతితో పరిశీలిస్తామని నెహ్రూ హామీ

న్యూఢిల్లీ, జూలై 27: "అస్సాంలో నూనె శుద్ధి కర్మాగారాన్ని స్థాపించాలన్న అభ్యర్థనకు త్రోసిపుచ్చే ప్రసక్తి లేదు. ఆవిషయంలో రాష్ట్రప్రభుత్వం చేర్కొన్న అంశాలను సానుభూతితో పరిశీలిస్తాము" అని శ్రీ నెహ్రూ చెప్పారు.

ఈ కొత్త కర్మాగారాన్ని ఏర్పాటు చేసేందుకు బీహార్ లోని బరౌనివద్దగల హంగులపై ఒక నివేదికను తయారు చేయవలసినదిగా ప్రభుత్వం కోరిందని చెప్తూ, గౌహతి విషయంలో కూడా ఒక నివేదికను తయారు చేయిస్తామని ప్రధాని అన్నారు. ఈ రెండు నివేదికలు అందిన మీదట ఈ అంశాన్ని క్షుణ్ణంగా పరిశీలించటానికి వీలౌతుందన్నారు. "అస్సాంకు మిగతా భారత దేశంతో కలిపే రైలుమార్గాలను అభివృద్ధి పరచాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది.

తమరాష్ట్రంలో ఈ నూనెశుద్ధి కర్మాగారాన్ని నెలకొల్పాలన్న అస్సాం ప్రజల కోరికను నేను అర్థం చేసుకోగలను. అలాంటి కోరికపట్ల నాకు సానుభూతి కూడా ఉన్నది. ఇలాంటి సాంకేతిక అంశాల్లో చాలా చిక్కులున్నాయి. వీటిని సంప్రదింపులద్వారా నిర్ణయించాను, ఆవేశరహితంగాను ఆలోచించటం అవసరము" అని శ్రీ నెహ్రూ తెలియజేశారు.

## జాతీయ గ్రంథ మండలి

### రాధాకృష్ణన్ చే ప్రారంభోత్సవం

న్యూఢిల్లీ, జూలై 28: జాతీయగ్రంథ మండలి ధర్మకర్తల ప్రథమసమావేశాన్ని ఆగస్టు 1 వ తేదీన ఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ ప్రారంభిస్తారని తెలుస్తోంది. ఈ సమావేశంలో మండలి కార్యక్రమాన్ని రూపొందిస్తారు. సాంకేతిక సహాయంనిమిత్తం ఒక సంఘాన్ని ఏర్పాటుచేసే విషయాన్ని పరిశీలిస్తారు.

## పుస్తకాల దిగుమతిపై నిర్బంధాల సడలింపు

ఇతర దేశాలనుండి తెప్పించే పుస్తకాల, పత్రికల దిగుమతి విషయంలో నిర్బంధాలను భారత ప్రభుత్వం సడలించింది. ఇక దిగుమతిదారులు ఆధారపు పన్ను సర్టిఫికెట్లను, దిగుమతికి సంబంధించిన వివరాలను తెలియజేయవలసిన పని లేదనీ, లైసెన్సుఫీజు చెల్లించ నవసరం లేదని కూడా ప్రభుత్వం ప్రకటించింది.

## గౌహతివద్ద వివరాల సేకరణకు కేంద్ర నిర్ణయం

న్యూఢిల్లీ, జూలై 28: గౌహతివద్ద నూనె శుద్ధి కర్మాగార స్థాపనకు, వివరాలతో ఒక నివేదికను తయారు చేయించటానికి భారత ప్రభుత్వం నిర్ణయించిందని అస్సాం ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ బి. పి. చాలిహా చెప్పారు.

ఇంతకుముందు బీహార్ లోని బరౌనివద్ద మాత్రమే యీ నూనెశుద్ధి కర్మాగారానికి సంబంధించిన వివరాలతో నివేదికను తయారు చేయవలసినదిగా ప్రభుత్వం ఆదేశించింది. ఇప్పుడు యీ రెండు నివేదికలను పరిశీలించిన మీదట, యీ కర్మాగారాన్ని ఎక్కడ నెలకొల్పేదీ ప్రభుత్వం నిర్ణయిస్తుంది.

## సమ్మె చేయాలని తపాలా ఉద్యోగులసంఘ నిర్ణయం

న్యూఢిల్లీ, జూలై 27: ఆగస్టు 8 వ తేదీ అర్ధరాత్రి నుండీ తంతి తపాలా ఉద్యోగులు దేశవ్యాప్తంగా సమ్మె చేయాలనీ ప్రభుత్వానికి అందజేసిన సమ్మె నోటీసులు యథాతథంగా వుంటాయనీ ఈ ఉద్యోగుల సమాఖ్య సంయుక్త కార్యాచరణమండలి నిశ్చయించింది.

కేంద్ర ఉద్యోగుల పరిస్థితిపై సమగ్ర పరిశీలన జరిపేందుకు వేసేసంఘంలోని సభ్యులను, వారు పరిశీలించవలసిన విషయాలను ప్రభుత్వం వచ్చేవారం ప్రకటిస్తుందని తెలుస్తోంది. ఈ సంఘంలో ఒక న్యాయాధికారి, ఒక స్వతంత్ర ఆర్థిక వేత్త, రాష్ట్ర, కేంద్ర పరిపాలనకు సంబంధించిన ఉద్యోగి ఉంటారని తెలుస్తోంది.

## పంజాబ్ వరదల్లో 50 గ్రామాల ముంపు

అమృతసరం, జూలై 27: రావి నది వరదల్లో అమృతసరంజిల్లాకు చెందిన దాదాపు 50 గ్రామాలు మునిగి పోయాయి.

ఘూసీవద్ద కరకట్టకు గండి పడి సుమారు 50 వేలమంది ప్రజలు నిరాశ్రయులైనారు.

కలకత్తా, జూలై 27: చౌరంగీ పార్కు స్ట్రీట్ కూడలివద్దనున్న జనరల్ ఔట్రామ్ విగ్రహాన్ని తీసివేసి, అస్థలంలో మహాత్మాగాంధీ కంచు విగ్రహాన్ని స్థాపించాలని పశ్చిమ బెంగాలు ప్రభుత్వం నిశ్చయించింది.

ఆప్రదేశంలో ఒక చిన్న పూదోట వేసి విశ్రాంతి స్థలంగా ఏర్పాటుచేయాలని కూడా నిర్ణయించారు.

## అణ్వస్త్ర నిషేధంపై కృశ్చేవ్ సవాలు

### పాశ్చాత్య రాజ్యాల వైఖరి గూర్చి రాజాజీ విమర్శ

న్యూఢిల్లీ, జూలై 27: అణ్వస్త్రాలను, ఉదజని అస్త్రాలను నిషేధిస్తూ, ఎప్పుడుపడితే అప్పుడు ఒప్పందం వ్రాసుకోడానికి తాము సిద్ధంగా ఉన్నామని రష్యా తరపున శ్రీ కృశ్చేవ్ విసిరిన సవాలును, పాశ్చాత్య రాజ్యాలు ఆమోదించక, మొండితనాన్ని చూపిస్తూ తమకున్న నైతిక ప్రతిపత్తిని, సర్వమూ, కోల్పోతున్నాయని శ్రీ రాజగోపాలాచారి నేడు విమర్శించారు.

శ్రీ రాజాజీ ఢిల్లీలో జరుగుతున్న అణ్వస్త్ర, ఉదజని అస్త్ర వ్యతిరేకోద్యమ సంఘ సమావేశానికి సందేశాన్ని పంపిస్తూ, అందులో యిలా గూడ అన్నారు: శ్రీ కృశ్చేవ్ ఇప్పుడంటే ఇప్పుడు తామూ ఈ అణ్వస్త్ర నిషేధాన్ని గూర్చి ఒప్పందాన్ని వ్రాసుకోడానికి సిద్ధంగా ఉన్నామన్నారు. ఈ ఒప్పందం కుదుర్చుకోకుండా బ్రిటన్, అమెరికాలను, ఏది అడ్డగిస్తోందో తెలియకుండా వుంది. శ్రీ కృశ్చేవ్ సవాలును ఆమోదించి, ఒప్పందాన్ని వ్రాసుకొని, దాన్ని సమితిలో, వీరు ఎందుకు నమోదు చేయకూడదు? ప్రపంచంలో శాస్త్రవేత్తలంతా, వినాశకరమైన ఈ ఆయుధాలను నిషేధించడం కోరుతున్నారు. అంతా ఒక్క కంఠంతో ఈ మాట చెబుతున్నారు. ఇట్టి వినాశక ఆయుధాలను వీరంతా ఎందుకు నిషేధించకూడదు? వీరిని ఇక్కడ అడ్డుతున్నది ఏమిటి? ఈ మొండితనంలో పాశ్చాత్య రాజ్యాలు తమ నైతిక ప్రతిపత్తినే కోల్పోతున్నాయి.

"పరిస్థితి ఇప్పుడు చాలా అగమ్యగోచరంగా వుంది. అయితే అమెరికా అధ్యక్షుడు, నిజంగా, ఈ విషయంలో సిగ్గుపడుతున్నట్లు కన్పిస్తున్నది. ఉచితమైన ఈ సిగ్గును భగవంతుడు ఇంకా ఎక్కువ చేయాలని నేను కోరుకుంటున్నాను. ఈ అణ్వస్త్రాలు మానవలోకానికి శత్రువులు. వీటిని అగ్రరాజ్యాలు నశ్వరించి, వీటిని తాము ఎప్పుడూ ఉపయోగించమని సమితికి వ్రాసి ఇచ్చేదాకా, భగవంతుడు, ఈ సిగ్గును పెంచుతూ వుండాలని కోరుకుంటున్నాను. ఈ ఆయుధాల పరీక్షలు ఆగిపోయి, ఈ ఆయుధాలు శాశ్వతంగా నిషేధించబడిన తర్వాత, నిరాయుధీకరణ వ్యవహారాన్ని గూర్చి, మంతనాలు సాగించుకోవచ్చు; ఒప్పందాలు వ్రాసుకోవచ్చు."

ఢిల్లీలో ఇప్పుడు ఈసభ, ఆగస్టులో జపానులో జరిగే, అణ్వస్త్ర, ఉదజని అస్త్ర వ్యతిరేక ప్రపంచ మహాసభను గూర్చి, జన భావాన్ని మేల్కొల్పడం కోసం జరుగుతోంది. ఈసభ శ్రీమతి రామేశ్వరి నెహ్రూ అధ్యక్షతను జరుగుతోంది. ఇవాళ్లి రేపు జరుగుతోంది. నేటి సభలో శ్రీమతి నెహ్రూయేగాక, పార్లమెంటు సభ్యులు, వాళ్లూ గూడా మాట్లాడారు. ఈసభలో జపానులో జరిగే సభకు పంపించే, ప్రతినిధివర్గాన్ని గూర్చిన నిర్ణయాలు జరుగుతాయి.

శ్రీ రాజాజీ తమ సందేశంలో జపానులో జరిగే సభనుగూర్చి ప్రస్తావించి, అది జయప్రదం కావాలన్నారు. అణ్వస్త్ర నిషేధాన్ని గూర్చి సాగుతున్న ఈ ప్రపంచ యుద్ధంలో భారత ప్రభుత్వము, ప్రజలు, తమ బాధ్యతలను నిర్వహించాలనికోరారు.

## 'వీలైతే ఢిల్లీకి 50 మైళ్లలో ఉంటాను'

### నగర అపరిశుభ్ర స్థితిపై ఆరోగ్యమంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, జూలై 27: "నా యిష్ట ప్రకారం కోరుకోమంటే ఢిల్లీకి 50 మైళ్ళ దూరంలో కాపురం ఉంటాను. రాజధానిలోని అపరిశుభ్ర పరిస్థితులే యిందుకు కారణము" అని కేంద్ర ఆరోగ్యమంత్రి శ్రీ డి. పి. కర్మార్కర్ లోక్ సభలో చెప్పారు.

నగరంలో పారిశుద్ధ్యం లేదని స్నేహితులు చేస్తున్న విమర్శలో దాదాపు వీథివిస్తానని గూడా శ్రీ కర్మార్కర్ అన్నారు.

## నెహ్రూపై ఎన్నికదావా

### ఖేంకా అభ్యంతరం త్రోసివేత

అలహాబాద్, జూలై 27: శ్రీ నెహ్రూ ఎన్నిక చెల్లదంటూ తాము వేసిన దావాను విచారించేటప్పుడు ఏకసభ్య విచారణ సంఘానికి లేదని అఖిల భారత గోసంరక్షణసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ సీతారాం ఖేంకా తెలిపిన ఆక్షేపణను విచారణ సంఘసభ్యుడు శ్రీచటర్జీ త్రోసివేశారు. ఈ సంఘంలో శ్రీ కె. కె. చటర్జీ ఒక్కరే సభ్యులు. శ్రీ ఖేంకా గత ఎన్నికల్లో, శ్రీ నెహ్రూతో పోటీచేసి ఓడిపోయారు.

ఒకప్రాంతంలో వచ్చే ఎన్నికదావాలను విచారించేందుకు, ఒకే విచారణ సంఘాన్ని నియమించాలనీ, అంతేకాని, ఎక్కడ సంఘాలను వేసే అధికారం ఎన్నికల సంఘానికి లేదనీ వీరు వాదించారు. మంత్రులను ఒకటి, యితర శాసనసభ్యులకు వేరే సంఘాలను ఏర్పాటుచేయటం రాజ్యాంగానికి విరుద్ధమనికూడా వీరు పేర్కొన్నారు.

## చేనేత వస్త్రాల ఉత్పత్తి లక్ష్యాలు

### క్రియాత్మక సాధనపై మొరార్జీ విజ్ఞప్తి

బొంబాయి, జూలై 27: రెండవ ప్రణాళికలో ప్రభుత్వం నిర్ణయించిన చేనేత వస్త్రోత్పత్తి లక్ష్యాలను సాధించగలమని యీ పారిశ్రామికులు, క్రియాత్మకంగా చూపించాలని కేంద్ర వాణిజ్య, పరిశ్రమల మంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ విజ్ఞప్తి చేశారు.

రెండో ప్రణాళికలో 100 కోట్ల గజాల చేనేతవస్త్రాన్ని ఉత్పత్తిచేయాలని నిర్ణయించారు. ఇందులో అంబర్ చరకానుంచి తీసే 30 కోట్ల గజాల నూలు గూడ చేరి ఉన్నది.

అఖిలభారత చేనేతమండలి సమావేశంలో ప్రసంగిస్తూ శ్రీ దేశాయ్ యింకా యీవిధంగా తెలియజేశారు. దేశావసరాలకు, ఎగుమతికి కావలసిన మొత్తం వస్త్రాలు ఉత్పత్తి అయ్యేటట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నది. చేనేత అవసరాలకుగాను, మిల్లులు ఉత్పత్తిచేస్తున్న నూలును, ఈ పరిశ్రమ వినియోగించకపోతే, మిల్లు వస్త్రాల ఉత్పత్తి అధికం చేయవలసినదిగా ప్రభుత్వంపై వత్తిడి చేయటం జరుగుతుంది. నూలు ఎగుమతులకు అనుమతించాలని గూడా కోరుతారు."

తరువాత యీ పరిశ్రమకు వరపతి సౌకర్యాలను కల్పించటంలో ప్రభుత్వం తీసుకున్న చర్యలను శ్రీ దేశాయ్ వివరించారు.

ఈ పరిశ్రమ అభివృద్ధికి పెద్ద పెద్ద మొత్తాలను ఖర్చుపెట్టామనీ, యికముందుగూడా యిదేవిధంగా వినియోగించటం జరుగుతూ ఉంటుందనీ మంత్రి హామీ యిచ్చారు.

## ప్రజల ఉత్సాహాన్ని హత మార్చింది

### జాతీయాభివృద్ధి విధానంపై విమర్శ

న్యూఢిల్లీ, జూలై 27: ప్రభుత్వ జాతీయాభివృద్ధి కార్యక్రమ విధానం ప్రజలను స్వయం సహాయంపై ఆధార పడేటట్లు చేసేబదులు వారి ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని హతమారుస్తూ ప్రభుత్వంపై అధికంగా ఆధారపడేటట్లు చేస్తోందని లోక్ సభలో కాంగ్రెసు సభ్యుడు డాక్టర్ సుభాగ్ సిన్హా విమర్శించారు.

జాతీయాభివృద్ధి శాఖకు కేటాయించిన 837 లక్షలరూపాయల పద్దుపై జరిగిన చర్చలో ఈశాఖకు ఇతర శాఖలకు సమన్వయం లేదనీ, భూసంస్కరణలను శీఘ్రంగా అమలు చేయాలనీ, ప్రజలకు సరియైన విధానంలో నచ్చచెప్పాలనీ పలువురు సభ్యులు సూచించారు.

ఈ కార్యక్రమాలకు చేసిన ఖర్చుకు తగిన ప్రతిఫలం లేదని కమ్యూనిస్టు సభ్యుడు శ్రీ రంగనాథ అన్నారు. వ్యవసాయదారులకు సరియైన అదనులో ఋణాల నీయాలని శ్రీమతి రేణుచక్రవర్తి తెలిపారు. గ్రామీణ సహకార ఋణ సంస్థలతోపాటి వస్తుండడంవల్ల, ఈశాఖ ఋణాల నీయరాదని కాంగ్రెసు సభ్యుడు శ్రీ సుపకార్ సూచించారు.

జాతీయాభివృద్ధి కార్యక్రమ పరిశీలనలో నూతన దృక్పథం అవసరమనీ, ఇది చాలా కష్టమైన కార్యమనీ, అందువల్ల ఈ కార్యక్రమాల నిర్వహణను అనుభవం గలవారికే అప్పగించాలనీ కాంగ్రెసు సభ్యురాలు శ్రీమతి సంగం లక్ష్మీబాయి తెలిపారు.

## త్రివేంద్రంలో రాష్ట్రపతి కార్యక్రమం

త్రివేంద్రం, జూలై 27: రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ ఆగస్టు 11 తేదీని త్రివేంద్రం చేరుకొంటారు. ఇక్కడ నాలుగురోజులు గడుపుతారు. ఆగస్టు 14 వ తేదీని రాష్ట్రపతి స్వాతంత్ర్య సమరంలో ప్రాణాలు కోల్పోయిన వారికి ఒక స్మారక చిహ్నం ఆవిష్కరిస్తారు. ఆ రోజున బహిరంగ సభలో కూడా ప్రసంగిస్తారు.

త్రివేంద్రం "శివాదులలో" ఫులయు నార్ కొట్టలో క్షయవ్యాధి చికిత్సాలయానికి రాష్ట్రపతి ఆగస్టు 12వ తేదిని ప్రారంభోత్సవం జరుపుతారు. 1956వ సంవత్సరం ప్రారంభంలో కేరళకువచ్చినప్పుడు ఆ ఆస్పత్రి నిర్మాణానికి శంకుస్థాపన చేసినదికూడా డా॥ రాజేంద్ర ప్రసాద్.

ఆగస్టు 12వ రాష్ట్రపతి హిందీ ప్రచార సమ్మేళనాన్ని ప్రారంభిస్తారు. ఆగస్టు 14వ త్రివేంద్రం ఆయుర్వేద కళాశాల నూతన భవనానికి ప్రారంభోత్సవం జరుపుతారు.

ఆగస్టు 15వ తేదీని స్వతంత్ర దినోత్సవ సందర్భంలో జరిగే పెరేడ్ లో సైనిక వందనం స్వీకరిస్తారు. ఆ రోజునే రాష్ట్రపతి రైలుబండిలో త్రివేంద్రం నుంచి బయలుదేరి వెళ్ళుతారు.

## కాశ్మీరునుండి పాక్‌ను వెడలగొట్టాలి

### సదర్-ఇ-రియాసత్ హెచ్చరిక

శ్రీనగర్, జూలై 27: దురాక్రమణ ఎక్కడ జరిగినా ఖండించాలనీ, అదే విధంగా కాశ్మీర్ లోచేసిన దురాక్రమణనుండి పాకిస్తాన్ ను వెడలగొట్టాలనీ కాశ్మీర్ ఉభయ శాసనసభల సంయుక్త సమావేశాన్ని ప్రారంభిస్తూ సదర్-ఇ-రియాసత్ యువరాజు కరణ్ సింగ్ ప్రపంచ ప్రజలను హెచ్చరిస్తూ, ఈ దురాక్రమణవల్ల వేలాది కాశ్మీర ప్రజలు ప్రజాస్వామ్య హక్కులకు దూర మయ్యారనీ, హింసాత్మకంగా ఒక దేశపు రాజ్యాన్ని మరొకదేశం ఆక్రమించుకోవడం తగదనీ విజ్ఞప్తి చేశారు. ఆర్థికంగా అనేక చిక్కులు కలిగినా, దేశం తగినంతగా అభివృద్ధి పొందిందనీ, ప్రథమ పంచవర్ష ప్రణాళికకు కేటాయించిన 1274 లక్షలలో సుమారు 1152 లక్షలరూపాయలు ఖర్చు అయ్యాయనీ ఆయన తెలిపారు. సాంకేతిక, పరిపాలన, సాంఘిక రంగాలలో కూడా అనేక క్లిష్ట పరిస్థితులు ఎదురయ్యాయన్నారు. రాష్ట్రంలోని వివిధ రంగాలలోను జరిగిన కృషిని ఈయన వివరించారు.

ఈయన ప్రసంగంపై శాసనసభలు సోమవారంనాడు చర్చ ప్రారంభిస్తాయి.

ఈయన ఉపన్యసించేముందు ఐదుగురు మంత్రులచేత ప్రమాణ స్వీకారం చేయించారు.

## మంత్రుల జీతాలు ఐదోవంతు తగ్గింపు

తమ జీతాలలో ఐదో వంతును, ఇతర భత్యాలలో సగం తగ్గించుకోవాలని కాశ్మీర్ మంత్రివర్గం జరిపిన ప్రథమ సమావేశంలో నిశ్చయించారు. ఇప్పుడు మంత్రులు వేయి రూపాయల జీతము, కారు భత్యం రెండువందల రూపాయలు తీసుకొంటున్నారు.

## పదోవంతు తగ్గింపుకు కరణ్ సింగ్ ఆమోదం

తమ జీతంలో పదోవంతును తగ్గించుకొనడానికి సదర్-ఇ-రియాసత్ కరణ్ సింగ్ నిశ్చయించుకొన్నారు.

## విదేశాలలోని కొనుగోలు శాఖలు

### ఖర్చులు తగ్గించుకోవాలని ఉత్తర్వు

న్యూఢిల్లీ, జూలై 26: లండన్, వాషింగ్టన్లలోని కొనుగోలు విభాగాలకు ప్రభుత్వ వ్యయాన్ని సాధ్యమైనంత తగ్గించాలని కోరడమైందని నిర్మాణాలమంత్రి శ్రీ కె. సి. రెడ్డి ఇవ్వాళ లోక్ సభలో తెలియజేశారు.

శ్రీ మెలరాగ్క ప్రశ్నకు, సమాధానం ఇస్తూ ఉద్యోగుల సంఖ్యను తగ్గించి ఖర్చు తగ్గించటానికి ఉన్నత సైనికోద్యోగులతో వ్యయక్షీణ సంఘాన్ని ఏర్పాటు చేశామని శ్రీ రెడ్డి తెలియజేశారు.

1956-57 లో లండన్‌లోని స్టోర్సు శాఖ క్రింద రు 59, 43, 760 లు, వాషింగ్టన్‌లోని భారతసప్లయి మిషన్ క్రింద రు 21, 57, 880 లు ఖర్చు అయిందనీ ఈ కార్యాలయాలను, అక్కడ వుండటం అవసరంగాక, భారత దేశానికి మార్చటానికి వీలులేదని కూడా మంత్రి చెప్పారు.

## రష్యానుంచి భారతసైనిక ప్రతినిధివర్గం రాక

న్యూఢిల్లీ, జూలై 27: భారత సర్వసైన్యాధిపతి, జనరల్ కె. యస్. తిమ్మయ్య నాయకుడుగా సోవియట్ యూనియన్ వెళ్లిన త్రివిధ దళాల సైనిక ప్రతినిధివర్గం యివాళ తిరిగివచ్చారు. వీరు రష్యాలో ఒకనెలరోజులపాటు పర్యటించారు.

## సబ్బు పరిశ్రమకు అభివృద్ధి మండలి

### పరిశీలిస్తున్నామని మంత్రి ప్రకటన

బొంబాయి, జూలై 27: సబ్బులు తత్సంబంధమైన యితర పరిశ్రమలకు ఒక అభివృద్ధి మండలిని ఏర్పాటుచేసే విషయమై ప్రభుత్వం పరిశీలిస్తున్నదని కేంద్ర భారీపరిశ్రమల మంత్రి శ్రీ మనూభాయ్ షా చెప్పారు.

సబ్బులు, తదితర వారిసద్య పదార్థాలను ఉత్పత్తిచేసే తోలి యంత్రానికి ప్రారంభోత్సవం జరుపుతూ, సమమైన ఆర్థికవ్యవస్థను సాధించేందుకు పెద్ద, మధ్యరకము, చిన్న పరిశ్రమలు ఒకే సమయంలో అభివృద్ధి చెందాలని, పెట్టుబడి, పెట్టుబడి సరుకులు (యంత్ర సామాగ్రి) వృద్ధి పొందటానికి పారిశ్రామిక వేత్తలు తీవ్రంగా కృషిచేయాలని శ్రీ షా కోరారు.

## స్వేచ్ఛగా ఉక్కు గొట్టాల ఎగుమతి

బొంబాయి, జూలై 26: మరలు, బోదుగులు (స్క్రూ, సాకెట్) ఉన్న ఉక్కు గొట్టాలు, బాయిలర్ గొట్టాలు లైన్ పైపులు తదితర గొట్టాలు యింకా యితర పైప్ ఫిట్టింగుల ఎగుమతికి, స్వేచ్ఛగా లైసెన్సు యివ్వాలని భారత ప్రభుత్వం నిశ్చయించింది.

## 74.4 కోట్ల నయాపైసానాణాల ముద్రణ

### మొత్తం విలువ రు. 250 లక్షలు

బొంబాయి, జూలై 26: క్రిందటి ఆర్థిక సంవత్సరంలో (1956-57) దేశంలోని టంకశాలలు మొత్తం 74,40,00,000 నయాపైసా నాణాలు ముద్రించినవి. వాటి విలువ 250 లక్షల రూపాయలు.

1956-57 వ. సంవత్సరం కరెన్సీ, ద్రవ్యాలు గురించి రిజర్వు బ్యాంకు తయారుచేసిన నివేదికలో పై విధంగా ఉన్నది. 1957 ఏప్రిల్ 1 వ తేదీనుంచి దేశంలో కొత్తనాణాలు ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం నిర్ణయించినది. ఆ నిర్ణయానుసారం దేశంలోని మూడు టంకశాలలు బొంబాయి, హైదరాబాదు, అలీపూర్ లలో ఉన్నవి-ఏడాది పొడవునా కొత్తనాణాల ముద్రణ సాగిస్తూనే ఉన్నవి.

అదేకాలంలో ప్రస్తుతంచలామణిలో ఉన్న అర్ధరూపాయ, పావలా కాసులు మొత్తం 125 లక్షల రూపాయల విలువ కలిగినవికూడా ముద్రించడం జరిగినది. వాటిలో అర్ధరూపాయ నాణాలవిలువ ఒకకోటి రూపాయలు. పావలా కాసుల విలువ 25 లక్షలరూపాయలు.

ఆఏడాది రూపాయ నాణాలు ముద్రించలేదు.

1956-57 లో మొత్తం 1,70,000 రూపాయలవిలువ కలిగిన చలామణిలో లేని నాణాలు ఉపసంహరించడం జరిగినది. 39,70,000 రూపాయల విలువ కలిగిన అరిగిపోయిన నాణాలు, ముద్రణ చెరిగినవి కూడా ఉపసంహరించడమైనది.

ఆసంవత్సరంలో ప్రభుత్వఖజానాలలోను, రైల్వేస్టేషన్లలోను కత్తిరించిన దొంగనాణాలవిలువ 2,10,000 రూపాయలు. 1955-56 లో కత్తిరించిన దొంగనాణాలవిలువ 1,70,000 రూపాయలు.

ఆ రెండు సంవత్సరాలలోనూ భారతప్రభుత్వ టంకశాలలు క్రిందటి ఏడాదికూడా విదేశాలనాణాలు ముద్రించినవి. 1956-57 లో ముద్రించిన విదేశ నాణాల విలువ 74,20,000 రూపాయలు, 1955-56లో 121 లక్షలరూపాయల విలువకలిగిన విదేశాల నాణాలు ముద్రించడమైనది.

## కాంగ్రెస్ సంస్థలు ప్రభుత్వాలు

### సామరస్యంపై చవన్ ఢేబర్ల చర్చలు

బొంబాయి, జూలై 25: కాంగ్రెస్ సంస్థలు ప్రభుత్వాల మధ్య సామరస్య సాధనపై కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ యు. యన్. ఢేబర్, బొంబాయి ముఖ్యమంత్రి శ్రీ వై. బి. చవన్‌తో చర్చలు జరిపారు. ఈ చర్చలు 2½గంటలసేపు జరిగాయి. బొంబాయి మంత్రులు, ఉపమంత్రులు యీ సమావేశానికి హాజరైనారు.

దేశం అంతటా, పరిపాలనకు అభివృద్ధి పరచడం అవశ్యకమని శ్రీ ఢేబర్ యీ సమావేశంలో కోరినట్లు తెలుస్తున్నది.

## నూనెవిత్తుల ఉత్పత్తి ఆంధ్రలో పెంచడానికి రు 261 వేలు మంజూరు

హైదరాబాదు, జూలై 26: ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో దేశంలో నూనె విత్తుల ఉత్పత్తి పెంచడానికి భారత కేంద్ర నూనె విత్తుల సంఘం వ్యవసాయ సంఘం 26,94,000 రూపాయలు మంజూరు చేసినది. ఆ మొత్తంలో 2,61,885 రూపాయలు ఆంధ్రప్రదేశ్ కు కేటాయించడమైనది.

జాతీయ ప్రణాళికసంఘం 1960-61 వ సంవత్సరానికి 76 లక్షల టన్నుల నూనె విత్తులు దేశంలో ఉత్పత్తిచేయాలని నిర్ణయించినది. ఈ లక్ష్యసాధనకు పదిరాష్ట్రాలు సమర్పించిన పథకాలను ఉపసంఘం పరిశీలించినది. ఉపసంఘ సమావేశం ఈరోజున సమాప్తమైనది.

నూనె విత్తుల ఉత్పత్తి చేసేభూమి విస్తీర్ణం సాధ్యమైనంతవరకు పెంచడానికి, ఇతోధికంగా ఉత్పత్తి చేసి నిమిత్తం కొత్త పద్ధతులు అవలంబించడానికి ఉపసంఘం కొన్ని పథకాలు ఆమోదించినది. ఆయా పథకాలు అమలుపరచడానికి అయ్యే వ్యయం అంతా నూనెవిత్తుల సంఘమే భరిస్తుంది.

నువ్వుల పరిశోధనా కేంద్రం ఆంధ్రప్రదేశ్ లోని కరీమ్‌నగర్ లో నెలకొల్పడానికి ఉపసంఘం ఒక పథకం ఆమోదించినది. ఆముదము, తదితర నూనె విత్తులకు పట్టే చీడలు గురించి పరిశోధన సాగించడానికి ఆంధ్ర ప్రదేశ్ లో ఏర్పాటు చేయడానికి కూడా ఉపసంఘం నిర్ణయించినది.

సాంకేతిక పరిశోధనా ఉపసంఘ సమావేశం కూడా ఈ రోజునే సాగినది. ఈ ఉపసంఘం ఆరుకొత్త పథకాలను నూనె విత్తుల సంఘామోదానికి సమర్పించినది. ప్రస్తుతం అమలులో ఉన్న నాలుగు పథకాలు విస్తృతం చేయడానికి కూడా ఉపసంఘం ప్రతిపాదనలు చేసినది. వీటిని అమలు పరచడానికి మొత్తం 2,68,000 రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా వేయడమైనది.

కొత్తపథకాలలో ఆంధ్రప్రదేశ్ కు సంబంధించినవి మూడు ఉన్నవి.

## ఉద్యోగుల తాత్కాలిక తొలగింపు

### సాంకేతిక పరిశీలనకు ప్రత్యేకపేర్పాట్ల ఫలితం

న్యూఢిల్లీ, జూలై 26: కేంద్ర నిర్మాణాల శాఖ నిర్మించిన కొన్ని కట్టడాలలో ప్రధాన సాంకేతిక పరిశీలకులు కొన్ని లోపాలు సూచించిన ఫలితంగా నిర్మాణాల మంత్రి కార్యాలయం ఆయుధుగురు గెజిటెడ్, మున్నూరు నాన్ గెజిటెడ్, ఉద్యోగులను ఉద్యోగము నుంచి తాత్కాలికంగా తొలగించినట్లు నేడు ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. ఈ ఉద్యోగులపైన డిపార్టుమెంటు ద్వారా వెంటనే విచారణ జరుగుతుందని కూడా ప్రకటనలో వుంది.

కేంద్ర నిర్మాణాలశాఖ నిర్మించే నిర్మాణాలను స్వతంత్రంగా పరిశీలించటానికి ప్రధాన సాంకేతిక పరిశీలన కేంద్రం ఏర్పడింది.

ఈ కేంద్రానికి పని జరుగుతున్నప్పుడు జరిగినతరువాత పని సక్రమంగా జరుగుతూ వుందా లేదో పరిశీలించే అధికారం వుంది.

## మైసూరులో సోషలిస్టుల సహాయ నిరాకరణ

బెంగుళూరు, జూలై 26: వచ్చే సంవత్సరం జనవరి 26వ తేదీ నుండి మైసూరులో సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించాలని భారత సోషలిస్టుపార్టీ మైసూరు సంఘం నిశ్చయించింది. దీనిపై డిసెంబరులో జరిగే వార్షిక సమావేశంలో తుది నిర్ణయం చేస్తారు.

## రేపల్లెలో అధిక పన్నులు

### తగ్గించే కృషి

రేపల్లె, జూలై 22: రేపల్లె పురపాలక సంఘం విధిస్తున్న పన్నులను పరిశీలించి, అవసరమైన ఏర్పాట్లు చేసేందుకు ఈ నెల 20 వ తేదీన జరిగిన బహిరంగ సభలో శ్రీయుతులు చావలి శ్రీకృష్ణయ్య, కొరటాల సత్యనారాయణ, నేతి వెంకటరమణ గారలు సభ్యులుగా ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. 20 వ తేదీన జరిగిన బహిరంగ సభకు శ్రీ గొల్లపూడి విజయరామయ్య అధ్యక్షత వహించారు.

రేపల్లెకు పురపాలక సంఘాన్ని ఏర్పాటు చేసి 16 నెలలయినా ఇంతవరకూ ఎన్నికలు జరగలేదు. పరిపాలన ప్రత్యేకాధ్యాపకుని వ్యవహారంలో ఉన్నది. పన్ను ఎక్కువై ప్రజలు ఇబ్బంది పడుతున్నారు కనుక ఈ వ్యవహారమంతా పరిశీలించేందుకు 20 వ తేదీన సభజరిగింది.

ప్రాతినిధ్యంలేని ఏర్పాటు చెయ్యకుండా పన్నులు పెరాలు చేయడం అన్యాయమని శ్రీయుతులు కొరటాల సత్యనారాయణ, చావలి శ్రీకృష్ణయ్య బలిజేపల్లి వెంకటసుబ్రహ్మణ్యం, శిష్ట్లా జన్మవి దుర్గయ్య, బరుగు పేరయ్యగారలు విమర్శించారు. పురపాలక సంఘాన్ని రద్దుచేయించేందుకు కృషి చెయ్యాలని శ్రీ నేతి వెంకటరమణ అన్నారు.

పురపాలక సంఘానికి వెంటనే ఎన్నికలను జరిపించవలసినదిగా ప్రభుత్వానికి సభ విజ్ఞప్తి చేసింది. ఎన్నికలు జరిగే దాకా ప్రజలకు సౌకర్యాలను ఏర్పాటు చేయవద్దని ఇచ్చిన ఉత్తరువులను రద్దు చేయవలసినదిగా ప్రభుత్వాన్ని కోరారు.

శ్రీ చావలి శ్రీ లేపయ్య వందన సమర్పణ చేశారు. (స్వ. వి.)

## ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్

వాల్తేరు, జూలై 26: ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్ కు గుంటూరు జిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గం నుంచి నిరుద్రోలు వాస్తవ్యుడు శ్రీ ప్రగడ కోటయ్య ఎన్నికయ్యారని రిజిస్ట్రార్ ప్రకటించారు. సెనేట్ కు తిరిగి ఎన్నికలు జరిగే వరకు శ్రీ కోటయ్య ఈ పదవిలో ఉంటారు.

## మదరాసు ధరలు

మదరాసు, జూలై 29:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎక్స్ఛేంజిలో సేల్సుటాక్సుతో సహా

| | | |
|---|---|---|
| మేలిబంగారం తులం | రు. | 108.75 |
| మూసా బంగారం తులం | రు. | 107.25 |
| సీమవెండి తులం 100 కి | రూపాయి | 185.50 |
| చిల్లర ధర | రు. | 1.90 |

వేరుశనగ

(561 పౌ॥ 1-కి ఎక్సుకోష్టా గిడ్డంగులు మెషీన్ సేల్సుటాక్సుతో సహా)

| | | |
|---|---|---|
| డిసెంబరు | రు. | 166-172 |
| వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ బిల్లో % పౌ.) గెడి చిల్లర ధర | | 340 |

(ఎక్సుపెల్లర్ కి రు. 25, సేల్సుటాక్సు, ఎక్సుసైజ్ సుంకంతో సహా)

50 లింకోటుదునూనె (87½ పౌనులు సేల్సుటాక్సు అదనం,

| | | |
|---|---|---|
| ఆంబువారక్కు | రు. | 33.50 |
| ఎం. ఎస్. (బ్రాండ్ సరా) | | 34.50 |
| రాజా | రు. | 34.00 |

ఆముదం

| | | |
|---|---|---|
| తిరుపత్తూరు (500 పౌ.) | రు. | 855 |
| సేలం లోటస్ బ్రాండ్ (87½ పౌ.) | | 28.00 |

పంచదార

| | |
|---|---|
| పాతుక్కోట | 103.03 |

## ఆకాశవాణి

బుధవారం, జూలై 31

హైదరాబాద్
(411 మీటర్లు)

ఉ॥ 6-30 సుప్రభాతం 7 తెలుగువార్తలు 7-15 ఎ. కె. సుబ్రహ్మణ్యం (విజయవాడనుంచి రిలే) 7-45 కన్నడ వార్తలు 8 ఆంగ్ల వార్తలు 8-15 హిందీ వార్తలు 8-30 మినారు పత్రిక.

మ॥ 12-30 ఘజల్ 12.50 మరాఠీ వార్తలు 1 కన్నడ వార్తలు 1-30 శాస్త్రీయ సంగీతం 1-50 తెలుగు వార్తలు 2 వాద్యగోష్ఠి 2-10 ఉన్నత పాఠశాలల విద్యార్థులకు 2.40 తెలుగు 2-50 ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు 3.20 ప్రసార సమాప్తి 3-45 పాఠశాలలకు (ఉర్దూ)

సా॥ 5-30 నాదస్వరం టి. చిన్న సుబ్బయ్య 5-45 కర్ణాటక సంగీతపాఠం 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వార్తలు 6-15 గ్రామసీమ 7 తెలుగు వార్తలు 7-15 గ్రామసీమ 7-30 ఆంధ్ర రచయితలు పెనుమర్తి వెంకటరత్నం ప్రసంగం (మద్రాసునుంచి రిలే) 7-45 గీతావళి 8 నాటిక: దయ్యాల లంక (మద్రాసునుంచి రిలే) 8-30 (ఢిల్లీనుంచి రిలే) 8-50 సుగమ సంగీత్ 9 ఆంగ్ల వార్తలు 9-15 తె. వా. 9.30 నాదస్వరం. 10 హిందూస్థానీ గానసభ (బొంబాయి నుంచి రిలే) 11 ప్రసార సమాప్తి.

విజయవాడ
(357.1 మీటర్లు)

ఉ॥ 6-30 సుప్రభాతం, 6-35 ప్రసార విశేషాలు 6-40 భక్తిరంజని 7 తె. వా. 7-15 ఎ. కె. సుబ్రహ్మణ్యం 7-45 సంగీతశిక్షణ 8 ఆంగ్లమున వార్తలు 8-15 హిందీలో వార్తలు.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు 1 శాస్త్రీయసంగీతం 1-30 సుగమ సంగీత్ 1-40 హిం. వా॥ 1-50 తె. వా. 2 తెలుగు 2-10 ఉన్నత పాఠశాలల విద్యార్థులకు 2.40 తెలుగు 2-50 ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు.

సా॥ 5-30 టి. కె. సుబ్రహ్మణ్యం 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా॥ 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తె. వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 ఆంధ్ర రచయితలు: పెనుమర్తి వెంకటరత్నం ప్రసంగం (మద్రాసునుంచి రిలే) 7-45 శాస్త్రీయసంగీతం 8 దయ్యాల లంక: నాటిక (మద్రాసునుంచి రిలే) 8.30 ఢిల్లీనుంచి రిలే 8-50 వాద్యసంగీతం 9 ఆం. వా॥ 9.15 తెలుగు 9-30 అమరభారతి: సంస్కృత సంచిక 10-15 వాద్యసంగీతం 10-30 ప్రసారసమాప్తి.

మద్రాసు (ఎ)
(319.1 మీటర్లు)

ఉ॥ 6-30 వ్యాఖ్యానం 6-35 కార్యక్రమ వివరణ (తమిళం) 7 వాద్యసమ్మేళనం 7-15 ఆ. వా. 7-30 త. భక్తిగీతం.

మ॥ 12 మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు (తమిళం) 1 నాటకం (తిరుచ్చినుంచి రిలే) 1-30 గీతమంజరి 1-40 హిం. వా. 1-50 గీతమాలిక 2 త. వా. 2-10 ఉన్నతపాఠశాలల విద్యార్థులకు (తమిళం) 2-40 గోష్ఠిగానం 2-50 ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు (తమిళం).

సా॥ 5 పాశ్చాత్య సంగీతం 5-30 సుగమ సంగీత్ 6-05 ప్రాంతీయ వా. (తమిళం) 6-15 రూపకం (తమిళం) 6-35 వాద్యసంగీతం 7-15 త. వా. 7-30 ఆంగ్ల ప్రసంగం 7-45 తమిళ కార్యక్రమం (తిరుచ్చినుంచి రిలే) 8 వి. రాజం అయ్యర్ 8-30 కి. విజయలక్ష్మి 9-15 తెలుగు: కె. విశ్వనాథరావు 9-45 పాశ్చాత్య సంగీతం 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (బి)
(211.8, 41.32 మీటర్లు)

ఉ॥ 6-50 ఎ వరె 7 తె వా. 7.30 ఉదయగానం 7-30 ఎ వరె 8 ఆం వా.

(211.8, 31.28 మీటర్లు)

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు 1 గీతమాలిక 1-30 ఆం వా. 1.40 గానమంజరి 1-50 తె వా. 2 గీతమంజరి 2-10 ఉన్నతపాఠశాలల విద్యార్థులకు 2-40 తెలుగు (విజయవాడనుంచి రిలే) 2-50 ప్రాథమికపాఠశాలల విద్యార్థులకు.

(211.8, 49.30 మీటర్లు)

సా॥ 5 ఎ వరె 5-30 తమిళ కార్యక్రమం 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆం వా. 6-05 ప్రాంతీయ వా. 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తె వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 ఆంధ్ర రచయితలు: పెనుమర్తి వెంకటరత్నం ప్రసంగం 7-45 కన్నడ కార్యక్రమం 8 నాటిక: దయ్యాలలంక 8.30 ఢిల్లీనుంచి రిలే 8-50 నిరాడు సంగీతం 9 ఆం. వా. 9-15 మద్రాసులో యీవారం (ఆంగ్లం) 9-30 అమరభారతి: సంస్కృత కార్యక్రమం (విజయవాడనుంచి రిలే) 10-15 గానలహరి 10-30 ప్రసార సమాప్తి.

## సభకంటె ముందు పత్రికలకు

### సమాచారశాఖ అధికారి విచారం

న్యూఢిల్లీ, జూలై 27: ఒక ప్రశ్నకు సభలో ఇంకా సమాధానం ఇవ్వవలసి ఉండగా, ముందే దీనిని పత్రికలకు పంపినందుకు కేంద్ర సమాచారశాఖ ప్రధాన అధికారి విచారం తెలియజేసినా, యికముందు యిలాంటి పొరపాట్లు జరుగకుండా హామీయిచ్చారని, స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగార్ లోక్ సభలో చెప్పారు.

## గంటల పంచాంగం

శ్రీ హేమలంబ సం॥ శ్రావణ శు॥ చతుర్థి 1957 సం॥ జూలై 30 మంగళవారం
ముం॥ చతుర్థి 19-51 పూర్వ 11-24 వర్జ్యం 17-57 ల 19-24 వ
శు॥ పంచమి జూలై 31 బుధవారం
బుధ॥ పంచమి 17-1 ఉత్త 9-18 వర్జ్యం 17-1 ల 18-30 వ.



# ఆంధ్రపత్రిక

ఒడలే యని యెంచరింపక
వరవర తుద్రియము కద మనంబున నగి డా
వొందుచు నదిసేయువనికి
వరాయణము వరమధర్మ వరముంటెల్లడ్
(మహాభారతము)

శ్రీ హేమలంబ సం॥ శ్రావణ శు॥ చతుర్థి
మంగళవారం

## కాశ్మీరు వ్యవహారాలు

కాశ్మీరు జాతీయమహాసభలోనూ చీలికలు ఏర్పడినవి. వర్గాలు తలెత్తినవి. నాలుగు సంవత్సరాల క్రితం షేక్ అబ్దుల్లాను ప్రధాన మంత్రి పదవి నుంచి తొలగించి నిర్బంధించడంతో రాష్ట్ర రాజకీయ పరిస్థితి స్తిమిత పడగలదని, జాతీయ మహాసభలో ఐకమత్యం పెంపొందగలదని అందరూ ఆశించారు. అంతఃకలహాలు అంతరించగలవని, రాష్ట్ర అభివృద్ధికి సమైక్య కృషి జరగ్గలదని విశ్వసించారు. గడిచిన నాలుగు సంవత్సరాల్లోనూ రాష్ట్ర రాజకీయపరిస్థితులు తృప్తికరంగానే వున్నా, శాంతి భద్రతలకు రాష్ట్రంలో ఎక్కడా భంగం కలగకపోయినా క్రిందటి రెండు మూడు మాసాల్నుంచీ రాష్ట్ర పరిస్థితి కొంత ఆందోళనకరంగానే వుంటున్నది. విద్రోహచర్యలు ప్రారంభమైనవి. కొన్నాళ్ల క్రితం బాంబు ప్రేలుళ్లు నిత్యసంఘటనలు అయినవి. రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు ప్రశాంతంగానే జరిగినా, జాతీయ మహాసభ అభ్యర్థులు అఖండ విజయాన్ని సాధించినా మొత్తం మీద పరిస్థితులు ఆందోళనకరంగా వున్నవనే చెప్పాలి. ప్రధాన మంత్రి బక్షీ గులాం మహమ్మద్ నాయకత్వంతో అసంతృప్తి చెందినవర్గం ఒకటి ఏర్పడింది. ఈ వర్గానికి శ్రీ జి. యం. సాదిక్ నాయకుడు.

నూతన మంత్రివర్గ నిర్మాణంలో శ్రీ బక్షీ గులాం మహమ్మద్ ఈవర్గ సహకారాన్ని పొందలేకపోయినారు. శ్రీ సాదిక్ తో జరిపిన సంప్రతింపులు ఫలించని కారణంగా శ్రీ బక్షీ రెండవ వర్గానికి మంత్రివర్గంలో ప్రాతినిధ్యం ఇవ్వలేకపోయినారు. శ్రీ సాదిక్ వర్గాన్ని వదలి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడంలో ముఖ్యమంత్రి బక్షీ గులాం మహమ్మద్ దూరదృష్టితోగాని, రాజనీతిజ్ఞతతోగాని ప్రవర్తింప లేదని చెప్పవలసివుంటుంది. కాశ్మీరులో జాతీయ మహాసభ అధికారం సుస్థిరం కాలేదు. జాతీయ మహాసభ తప్ప చెప్పుకోతగ్గ మరొక రాజకీయపక్షం లేకపోయినప్పటికీ, జాతీయ మహాసభ ఇటీవలి చీలికలవల్ల బలహీనమై పోక తప్పదు. జాతీయమహాసభ బలహీనత రాష్ట్రంలో అరాచకానికి దారి తీస్తుందని నాయకులు బక్షీ గులాం మహమ్మద్, జి. యం. సాదిక్ లు గ్రహించవలసి యున్నది. క్రిందటి నాలుగు సంవత్సరాల్లో కంటే పరిస్థితులు ఇప్పుడు చాలా ప్రమాదకరంగా వున్నవి. రాష్ట్రంలో అశాంతిని ప్రోత్సహించడానికి ప్రభుత్వంపై తిరుగుబాటును ప్రేరేపించడానికి పాకిస్తాన్ అనేక విధాల ప్రయత్నిస్తున్నది. అంతర్జాతీయ సైనికదళం కాశ్మీరులో ప్రవేశించడానికి వీలుగా పాకిస్తాన్ పెద్ద ఎత్తున సైనిక చర్యలనుకూడా ప్రారంభింపవచ్చును. భారత పార్లమెంటు కాంగ్రెసు పక్ష సమావేశంలో పాకిస్తాన్ ఆలోచనలనుగురించి ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ చేసిన హెచ్చరికను మనస్సుకు పట్టించుకొని కాశ్మీరు నాయకులు ప్రవర్తించవలసి వుంటుంది. కాశ్మీరుపై పాకిస్తాన్ తిరిగి దండయాత్ర జరిపితే, పూర్వంలాగే భారతప్రభుత్వం దురాక్రమణను ప్రతిఘటించవచ్చును. కాని కాశ్మీరు ఇతర రాష్ట్రాల మాదిరికాదు గనుక, కాశ్మీరు ప్రభుత్వం ఈ పరిణామాన్ని నివారించడానికి ప్రత్యేకంగా కృషి చేయవలసి వుంటుంది. అందుకు, నూతన మంత్రివర్గం అధికారాన్ని స్వీకరించినా, ముఖ్య మంత్రి బక్షీ గులాం మహమ్మద్ శ్రీ సాదిక్ తోనూ వారి అనుచరులతోను తిరిగి సంప్రతింపులు ప్రారంభించి జాతీయ మహాసభలో ఐకమత్యాన్ని సాధించడానికి తీవ్ర కృషి చేయవలసి వున్నది.

## కేంద్ర యన్. జి. ఓ. ల సమ్మె

### నాగపూర్ ఉద్యోగులు సుముఖం

నాగపూర్, జూలై 28: ఇక్కడి కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల్లో పని చేస్తున్న 8 వేలమంది నాన్ గజెటెడ్ ఉద్యోగులలో, నూటికి 95 మందిపైచిలుకు, ఆగస్టు 8 అర్ధరాత్రి నుంచి దేశ వ్యాప్తంగ ఆరంభం అవుతున్న సమ్మెలో పాల్గొనేందుకు నిర్ణయించారు. రెండవ వేతన నిర్ణాయక సంఘ నియామకము, అధిక కరువుభత్యాలను సాధించే ఉద్దేశ్యంతో కేంద్ర నాన్ గజెటెడ్ ఉద్యోగులు యీ సమ్మెను సంకల్పించారన్నది. పాఠకులకు విదితమే.

అఖిలభారత తపాలా ఉద్యోగుల సంఘం ప్రధానకార్యదర్శి శ్రీ వి. జి. దళవే మాట్లాడుతూ, యీ ఉద్యోగుల జీతాలను తాత్కాలికంగా రు 15 చొప్పున పెంచితే ప్రభుత్వానికి రు 800 కోట్లు అదనంగా ఖర్చు అవుతుందనీ, ఆదాయపుపన్నును ఎగవేసేవారిపై తీవ్రంగా చర్య లు తీసుకుంటే యీ మొత్తంలో సుమారు రు 300 కోట్లు వసూలు అవుతుందనీ చెప్పారు.

### 'సమ్మె చేస్తే ప్రజల సానుభూతి ఉండదు'

భారత జాతీయ కార్మిక సంఘానికి చెందిన తమిళనాడుశాఖ కార్యవర్గం మధురైలో యీ 28 న సమావేశమైంది. తపాలా ఉద్యోగుల కోరికలు సమంజసమేననీ తెలుపుతూ సానుభూతిని వ్యక్తం చేసింది. అయి తే వీరు సమ్మెకు దిగితే మాత్రం ప్రజల సానుభూతిని కోల్పోవలసి ఉంటుందని యీ కార్యవర్గం స్పష్టం చేసింది.

### బెంగుళూరు కార్మిక నాయకుల సమర్థన

బెంగుళూరు, జూలై 28: నగరంలోని వివిధ కార్మిక సంఘాల నాయకులు యిక్కడ సమావేశమై కేంద్ర ఉద్యోగుల సమ్మె నిర్ణయాన్ని సమర్థించారు.

## భారత్ దిగుమతులకు ఈజిప్ట్ అనుమతి

బొంబాయి, జూలై 27 : 1953నాటి భారత, ఈజిప్టు, వ్యాపార ఒడంబడిక ప్రకారం, భారతదేశంనుంచికొన్ని వస్తువులదిగుమతినిఅనుమతించేందుకు ఈజిప్టు ప్రభుత్వం ఆలోచిస్తున్నదని ఎగుమతుల జాయింట్ చీఫ్ కంట్రోలర్ ప్రకటించారు.

దీనిలో జనపనార వస్తువులు, తేయాకు, మిరియాలు, పోగాకు, విద్యుత్ పరికరాలు, ఇతర యింజనీరింగ్ వస్తువులు, రసాయనిక ద్రవ్యాలు, మందులు ఉన్నాయి.

## నేపాల్ మంత్రివర్గ తొలి సమావేశం

ఖట్మండూ, జూలై 28: నేపాల్ ప్రధానమంత్రి డాక్టర్ కె. ఐ. సింగ్, దేశీయ, విదేశాంగ శాఖలను నిర్వహిస్తారు. మిగతా పదిమంది మంత్రులకు కూడా శాఖావిభజన జరిగింది.

నేపాల్ మంత్రివర్గం ఇవాళ తొలి సారిగా సమావేశం అయింది.

# వానకాలపు చదువులు- బోధనా వసతులు

## వేసంకాలంలోనే వస్తూఉండే పుస్తకాలకూ జాప్యమే

బెజవాడ, జూలై 29: చిరకాలముగా ఉపాధ్యాయవృత్తిలో వున్న శ్రీ అర్జునరావు ఇలా వ్రాస్తున్నారు:

ఆంధ్ర ప్రభుత్వము వారి విద్యా విధానము చాల విడ్డూరముగ నున్నది. ఇంతవరకు యస్. యస్. యల్. సి. పాఠ్యగ్రంథ ము లు చాల మట్టుకు నష్టమయి లేదు. నేను చదివిన రోజులలో పాఠ్యగ్రంథములు వేసవి సెలవులలోనే లభించెడివి. కంఠస్థము చేయవలసిన భాగములు వేసవి సెలవులలోనే విద్యార్థులు చాలవరకు కంఠస్థము చేసికొని మళ్ళీ తెరచునాటికి పాఠ్యగ్రంథములలో సహజ్ఞానులకు హాజరయ్యేది వారు. ప్రభుత్వమువారి విద్యా విధానపు నిబంధనలు విద్యార్థులు ఎంతో కష్టపడు మంది ఈ తీర్థులైతే అంతభాగుండును అనునట్లుగా నున్నవి.

ఇందులకు ఉదాహరణముగా ఈ క్రింది విషయముల గమనించిన విశదమగును. పాఠ్యగ్రంథములు సకాలములో అచ్చువేయించి విద్యార్థులకు అందించకపోవటము, చీటికి మాటికి పరీక్షా పత్రముల విధానములు మార్చుట, మార్చిననూ మార్పులను గురించి ఉపాధ్యాయులకు విద్యార్థులకు తగినంతముందుగా తెలియజేయక పోవటమూ, విద్యార్థులస్థాయిని పెంపొందించు నెపముతో అకస్మాత్తుగా పరీక్షల నిబంధనలు కఠినతరముజేయుట బహుశార్థ సాధక కార్యక్రమము పేరుతో విద్యార్థులను 8 భాషలతోపాటు అనేక ఇతర విషయములను నేర్చుకోవలసినదిగా నిర్బంధించుట, వారమునకు 2 పీరియడ్లు మాత్రమే కేటాయించి హిందీని నిర్బంధభాషగా చేయుట, తిరిగి నలో ధనా సరికరము లేక పోవుట, ఖాళీగానున్న ఉపాధ్యాయ పదవుల యందు ఆగస్టువరకు ఉపాధ్యాయులను నియమించకపోవుట (ముఖ్యముగా జిల్లా బోర్డు బడులయందు), ఏ ఉపాధ్యాయుడైనా ఒక నెలవరకు సెలవు పెట్టినచో అట్టి ఉపాధ్యాయుడు తిరిగి పనిలో ప్రవేశించువరకు వేరొక ఉపాధ్యాయుని నియమించకపోవుట, ఇట్టి లోపములు ఎన్నియో కలవు.

అన్నిటికన్న మించినది, ఉపాధ్యాయులను, విద్యార్థులను దద్దమ్మలనుగా తయారుచేయునది. ఈ దేశములో సెకండరీ విద్యావిధానము ప్రవేశపెట్టిన పిదప ఎన్నడు కనివిని ఎరిగి యుండనిది, 50 మంది విద్యార్థులను కలిపి ఒకే గదిలో కూర్చుండబెట్టుట. గత సంవత్సరము వరకు 46 మంది విద్యార్థులున్న రెండు సెక్షనులుగా చేయవచ్చును. ఇటీవల విద్యాశాఖా డైరక్టరు ఉత్తరువు ప్రకారము 60 మంది విద్యార్థులున్ననేగాని రెండు సెక్షనులు చేయుటకు వీలుండదు. 50 మందివరకు ఒకే సెక్షనులో నుండవచ్చును. ఇట్టి నిబంధన ఫలితమెట్లుండునో నూహింపననవసరము. ఇకనుండి ఉపాధ్యాయుడు ఒక దొడ్డిలో గొర్రెల కాపరిమందను మళ్ల వేసినట్లుగా విద్యార్థులను మళ్ల వేయును. 50 మంది విద్యార్థులను ఒక గదిలో కూర్చుండబెట్టి ఉపాధ్యాయుడు విద్యార్థులను ఉత్తీర్ణులుగా జేయవలెను-వారి స్థాయిని 4% వరకు పెంపొందించవలయును! ఇది సంభవమా! ఇది కేవలము విద్యార్థులను ఉపాధ్యాయులను అపహాస్యము చేయుటకు పెట్టిన నిబంధన. ఇకనుండి విద్యార్థులు "విటమినులు అనగేమి" అను ప్రశ్నకు వియట్నాము ప్రజలు అని సమాధానమిచ్చిన ఆశ్చర్యపడవలసిన అవసరము లేదు.

## కేరళ కాంగ్రెసు అధ్యక్షుడు: దామోదరమీనన్ ఎన్నిక

ఎర్నాకులం, జూలై 28: కేరళప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడుగా శ్రీ కె. ఎ. దామోదరమీనన్ ఎన్నిక అయినారు. వీరి ఎన్నిక ఏకగ్రీవంగా జరిగింది. శ్రీ మీనన్ ఇంతవరకు ప్రదేశ్ కాంగ్రెసు కార్యదర్శిగా ఉంటూవచ్చారు.

కేరళ కాంగ్రెసు అధ్యక్ష పదవికి శ్రీ కె. మాధవమీనన్ రాజీనామా ఇవ్వటం వల్ల ఈ ఎన్నిక జరిగింది.

నిన్న సాయంత్రం జరిగిన ప్రదేశ కాంగ్రెసు ప్రత్యేక సమావేశానికి శ్రీ మాధవమీనన్ అధ్యక్షత వహించారు. అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శులు శ్రీయుతులు శ్రీమన్నారాయణ్, కె. పి. మాధవన్‌నాయర్, కేరళ సంధాన సంఘ సభ్యుడు శ్రీ యం. యస్. మల్లయ్య ఈ సమావేశానికి హాజరైనారు.

శ్రీ దామోదరమీనన్ పేరును శ్రీ ఆర్. శంకర్ ప్రతిపాదించగా, శ్రీ పానంపిల్లి గోవిందమీనన్ ప్రభృతులు బలపరిచారు.

## ఆర్థికశాఖ సిబ్బంది తగ్గింపుకు యోచన

న్యూఢిల్లీ, జూలై 27 : ఆర్థికశాఖలో పొదుపు చేసే ఉద్దేశ్యంతో యీ శాఖకు చెందిన వ్యయపరిశీలన అధికారులు, సిబ్బంది తగ్గింపు విషయమై ఆలోచిస్తున్నారు. ఈ శాఖలో యిదివరకు ఆరు ఉపకార్యదర్శి పదవులను తగ్గించారు.

## పంజాబు, అస్సాం, బెంగాల్ లలో వరదలు

### కొన్ని గ్రామాలకు ముంపు: పంటలకు నష్టం

న్యూఢిల్లీ, జూలై 28: అస్సాంలో బ్రహ్మపుత్ర, పశ్చిమ బెంగాలులో నాగ్రకటా, జల్ ధబ్బనదులు, పంజాబులో రావి, యమునానదులు పొంగి, వరదలువచ్చాయి. ఢిల్లీవద్ద యమునవంతెన దగ్గర నీటి మట్టం సముద్రమట్టానికి 672 అడుగులు పెరిగింది జరిగిన 24 గంటలుగా తరక్క పెరక్క అట్లాగే వుంది.

### అస్సాంలో వరద

అస్సాం రాష్ట్రంలో జోర్ హాట్ నుంచి వచ్చిన వార్తలను బట్టి బ్రహ్మపుత్ర పొంగినందువల్ల శిబ్ సాగర్ జిల్లాలో 180 గ్రామాలు, 40 వేలమంది ప్రజలు దెబ్బతిన్నారు. మేరబిక్, ధపరగాహ్ ప్రాంతాల్లో మేరిజా తిరిగి జనులు, మజాలీ ప్రాంతంలో మరో 9 గ్రామాలవారు వదిలి, భయపడి, తమ ఇళ్లను విస్మకొని, సురక్షిత ప్రదేశాలకు పారిపోతున్నారు. బ్రహ్మపుత్ర పొంగిందంటే నేలనుకోసుకుంటూపోతుంది. జోర్ హాట్ ప్రాంతంలో నది కొంచెం తగ్గిన తరువాత చూస్తే; పంట చేలన్నీ నాశనమై కన్పించాయి.

### పశ్చిమబెంగాలులో జల్‌పాయ్‌గురి

పశ్చిమబెంగాలు రాష్ట్రంలో జల్ పాయ్‌గురిజిల్లాలోని చిన్న నదులన్నీ పొంగి, నానా విలయం తెచ్చి పెడుతున్నాయి. వర్షాలు అధికంగా పడి ఈ నదులు పొంగాయి. జల్ పాయ్‌గురి పట్టణంలో నిన్న సాయంత్రం నుంచి 18 దుక్కుల వర్షం కురిసింది. నాగ్రకానది మీది వంతెన దెబ్బతింది. జల్ ధబ్బనది మీద వంతెన కూలే స్థితిలోకి వచ్చింది.

### పంజాబులో రావినది పొంగు

పంజాబులో రావినది పొంగి మధుపూర్ హెడ్ వర్క్సులకు ప్రమాదకరంగా పరిణమించింది. సైన్యం తొలూరు ఖ్యం దాలు వెళ్లి దానికి ప్రమాదం రాకుండా పనిని నడిపించాయి. నది తూర్పు ఒడ్డు కోసుకుపోయింది. అప్పుడు రాష్ట్ర ప్రభుత్వం సైన్యం సహాయాన్ని అర్థించగా, వారు వచ్చి, రాళ్ళు అడ్డి వేసి గండిని పూడ్చారు. ఇప్పుడు నది పొంగు కొంత తగ్గింది.

ఈ నదిని అనుకొని పక్కనల్లా పోతుంది. అది గూడ పొంగింది. పలు గ్రామాలను ముంచింది.

### తేజ్‌వాలా హెడ్‌వర్క్సుల దగ్గర గండి

యమునానది పొంగినందువల్ల కొన్ని రోజుల క్రితం తేజ్ వాలా హెడ్ వర్క్సులవద్ద 800 అడుగుల వెడల్పున గట్టు గండిపడ్డట్లు, పంజాబు నీటి పారుదలల మంత్రి సర్దార్ గ్యాన్‌సింగ్ రారేవాలా నేడు వెల్లడి చేశారు.

# పండ్లకు కాయగూరలకు విక్రయం పన్ను మినహాయింపు

## ఆర్థిక మంత్రి గోపాలరెడ్డి వివరణ

హైదరాబాదు, జూలై 28: విక్రయం పన్ను వసూలునుంచి పండ్లు, కాయగూరలు మినహాయించమని కోరుతూ తెలంగాణ ప్రాంతంవారు చేసిన విన్నపాలు ప్రభుత్వానికి చేరినవని, కొబ్బరికాయలు మినహాగా అన్ని పండ్లను, ఉర్లగడ్డలు, ఉల్లిపాయలు మినహాగా అన్ని కాయగూరలను విక్రయం పన్ను వసూలునుంచి మినహాయించడమైనదని ఆర్థిక శాఖామంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి శాసనసభలో శ్రీ బందా నారాయణప్ప ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

కొబ్బరికాయల మొదటి కొనుగోలుపై రూపాయికి మూడు నయాపైసాల చొప్పున ఒక్క పర్యాయం మాత్రమే పన్ను వసూలు చేస్తున్నట్లు ఆర్థిక శాఖామంత్రి చెప్పారు. ఉర్లగడ్డలు, ఉల్లిపాయలు విక్రయించే వ్యాపారస్థులకు వారి మొత్తం వ్యాపారం 20,000 రూపాయలకు మించకపోతే ఈ క్రింద సూచించిన విధంగా కొన్ని సౌకర్యాలు కల్పించడమైనది: ఉల్లిపాయలు-మొత్తం వ్యాపారం 12,500 రూపాయలకు మించకపోతే 48 రూపాయలు విక్రయం పన్నుగా చెల్లించవలసి ఉంటుంది. 12,500 రూపాయలకు పైబడి 20,000 రూపాయలకు మించకపోతే 72 రూపాయల పన్ను చెల్లించవలసి ఉంటుంది. ఉర్లగడ్డలు-మొత్తం వ్యాపారం 15,000 రూపాయలకు మించకపోతే 96 రూపాయల పన్ను చెల్లించవలసి ఉంటుంది. 15,000 రూపాయలకు పైబడి 20,000 రూపాయలకు మించకపోతే 144 రూపాయలపన్ను చెల్లించవలసి ఉంటుంది.

ఆంధ్రలో అరటిపండ్లు, బత్తాయి, నారింజ, కమలా మున్నగు ఫలాలు విక్రయించే; వారుకాని, కొనుగోలుదారులు కాని పన్ను చెల్లించనవసరం లేదనికూడా ఆర్థిక శాఖామంత్రి శ్రీ గోపాలరెడ్డి శ్రీ ఎమ్. రాజారాం ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. 1950 హైదరాబాదు సాధారణ విక్రయం పన్ను చట్టంక్రింద డబ్బాలలో విక్రయించితే తప్ప పండ్లు, ఎండ బెట్టిన పండ్లు కూడా 1950 మే నెలనుంచి 1952 జూలై ఆఖరివరకు విక్రయం పన్ను వసూలునుంచి మినహాయించడం జరిగినది. దిగుమతి కష్టమ్సునుంకాల రద్దు మూలంగా వచ్చిన నష్టం భర్తీ చేసుకోవడానికిగాను 1952 ఆగస్టు 1 వ తేది నుంచి అప్పటి హైదరాబాదు ప్రభుత్వం ఆ మినహాయింపు రద్దు చేసినది. ఆంధ్ర ప్రదేశ్ సాధారణ విక్రయం పన్ను చట్టం ఈ ఏడాది జూన్ 15 వ తేదిని అమలులోనికి వచ్చినది. ఆ చట్టం క్రింద కొబ్బరికాయలు మినహాగా తక్కిన పండ్లు అన్నీ నిలువ ఉంచినవి. ఎండబెట్టినవి కూడా డబ్బాలలో ఉంచి విక్రయించితేతప్ప విక్రయం పన్ను వసూలునుంచి మినహాయించడం జరిగినది.

ఈ మినహాయింపు జూన్ 15 వ తేదినుంచి ఆంధ్ర ప్రదేశ్ లో అంతటా అమలులోనికి వచ్చినదనికూడా మంత్రి చెప్పారు.

## జపానులో వరదలు

### 4 వేలమంది హతులు

టోక్యో, జూలై 28: దక్షిణ జపానులో కియూషు ద్వీపంలో వరదలవల్ల చనిపోయినవారు, దెబ్బతిన్నవారు, కన్పించకుండా పోయినవారు అంతా కలిసి మొత్తం 4 వేలమంది చనిపోయినట్లు జపాను పోలీసుఅధికారులు నేడు ప్రకటించారు.

ఈ వరదలవల్ల బాధితులయినవారి జాబితాను ఒకదాన్ని వీరు ప్రకటిస్తామనుకున్నారు, ఇప్పుడు ఆ పనిని విరమించుకున్నారు. ఈ కష్టంలో మొత్తం 240000 మంది నిర్వాసులైపోయినట్లు మాత్రం ప్రకటించారు.

జపాను ప్రధానమంత్రి శ్రీ కిషి, తక్కిన మంత్రులతో ఈ ప్రాంతం అంతా పర్యటించారు. బాధితులకు సహాయాన్ని వెంటనే పనుకూరుస్తామని హామీ ఇచ్చారు.

అరియాకె సముద్రంలో చేరే అడుగున్న శిలాలను చూచి, ఇసయ పట్టణంలో నేలలో కూరుకొని పోయిన జనుల శవాలనుచూచి, ప్రధానమంత్రి భయభ్రాంతులైపోయారు.

1945 లో ఒకసారి కియూషుద్వీపం ఉప్పెనకు గురియై నానా నష్టాలకు గురి అయింది. అప్పుడు 2076 మంది చనిపోయారు. 2829 మంది ఘోరంగా తీవ్రగాయాలయినారు. 1046 మంది కన్పించలేదు. ఇప్పుడు ఈ వరదలవల్ల అంతకన్నా అధిక ప్రమాదం అధిక నష్టం జరిగిందని అధికారులు చెబుతున్నారు. అప్పుడు ఉప్పెనవల్ల ఆ నష్టం జరిగితే, ఇప్పుడు మూడు రోజులపాటు ధారాపాతంగా పడిన వర్షంవల్ల ఈ నష్టం జరిగింది.

# భారత పరిశ్రమల వృద్ధికి విదేశీ సంస్థల తోడ్పాటు

## త్వరలో పాశ్చాత్య రాజ్య పర్యటనకు బిర్లా ప్రతినిధివర్గం ప్రయాణం

న్యూఢిల్లీ, జూలై 28 : భారత పరిశ్రమలవృద్ధికి విదేశీ సంస్థల తోడ్పాటు సాధించే అవకాశాలు పరిశీలించడానికి, శ్రీ జి. డి. బిర్లా నాయకత్వంలో భారత పారిశ్రామిక వాణిజ్య ప్రముఖులు కొందరు పాశ్చాత్య రాజ్యాలు పర్యటించడానికి ఏర్పాట్లు చేసుకున్నారు.

శ్రీ బిర్లా ఆగస్టు 4 వ తేదీన బొంబాయిలో బయలుదేరి యూరప్ వెడుతున్నారు.

భారీ ఇంజనీరింగు, రేయాన్, వస్త్ర పరిశ్రమలు, భారీ రసాయన పరిశ్రమలు, అద్దకపు రంగులు, విద్యుత్పరికరాలు, ట్రాన్స్‌ఫార్మర్, ప్లాస్టిక్ పౌడర్, యంత్రపరికరాలు, సిమెంటు, కంచజార, పరిశ్రమలు, బ్యాంకింగు యజమానుల ప్రతినిధులు పారిశ్రామికులు వ్యాపారులు మొత్తం 14 మంది పర్యటనలో పాల్గొంటారు.

అయితే ఈ ప్రతినిధివర్గం ఏదో సాధించుకువస్తుందని పెద్ద ఆశలు పెట్టుకోరాదని శ్రీ బిర్లా పత్రికా విలేఖరులతో గోష్ఠిలో అన్నారు. ప్రతినిధులు అందరూ న్యూయార్కులో సెప్టెంబరు 10 వ తేదీన కలుసుకోవడానికి ఏర్పాటయిందని శ్రీ బిర్లా చెప్పారు. సరిగా ఆ సమయానికే, భారత ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారికూడా న్యూయార్కు చేరుకోవచ్చు.

ఇది అనధికార ప్రతినిధివర్గం అయినందువల్ల, పరపతిరూపంలో ద్రవ్యం అక్కడనుంచి తెచ్చుకోడానికి వీలుండదు.

అంతర్జాతీయ వాణిజ్యం ఏరీతిగా ఉందో స్వయంగా పరిశీలించడం, విదేశీ సంస్థలతో పరిచయాలువేర్పరుచుకోడం, విదేశీ పారిశ్రామికుల సహకారం సహాయంసంపాదించడానికి వీలున్నంతవరకు ప్రయత్నించడం, సాంకేతిక నిపుణుల సహాయంకోసం ప్రయత్నించడం ఈ ప్రతినిధివర్గం పర్యటన ముఖ్యోద్దేశాలని శ్రీ బిర్లా వివరించారు.

ప్రతినిధివర్గ సభ్యులు ఎవరిఖర్చులు వారే భరిస్తున్నారట. వీరికి అవసరమైన సహాయం చేయవలసిందని భారత ప్రభుత్వం ఆ దేశాలలోని తమ రాయబార కార్యాలయాలన్నిటినీ ఆదేశించింది.

ప్రతినిధులలో ముగ్గురు అప్పుడే యూరప్‌లో ఉన్నారు.

వీరి పర్యటన అనంతరం మళ్ళీ పారిశ్రామికులు విడి విడిగా మరోసారి ఆ దేశాలు వెళ్లవలసిన అవసరం కూడా ఉండవచ్చు.

తాత్కాలికంగా నిర్ణయించబడిన కార్యక్రమం ప్రకారం, ఈ ప్రతినిధివర్గం వాషింగ్టన్, న్యూయార్కు, కెనడా, బ్రిటన్, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సు, ఇంకా వీలుంటే బెల్జియం, హాలెండ్ కూడా పర్యటిస్తారు.

వాషింగ్టన్ లో వీరు ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థల అధికారులను కలుసుకుని చర్చిస్తారు.

ఈ ప్రతినిధివర్గం ఇటీవల లాంఛనప్రాయంగా కలకత్తాలో కలుసుకున్నప్పుడు, విదేశాలలో పారిశ్రామికులతో చర్చించడంకోసం, ఎవరికి వారు తమ పరిశ్రమల అభివృద్ధిగురించి పథకాలు స్పష్టంగా తయారుచేసుకుని మరీ బయలుదేరాలని నిర్ణయించుకున్నారట.

ప్రతినిధివర్గం అనధికారరీత్యా పర్యటిస్తున్నందువల్ల అవకాశాల పరిశీలనకు మించి సాధించేది యేమీ ఉండకపోవచ్చు. అయితే దేశంలో ప్రస్తుత ఆర్థిక క్లిష్టస్థితివల్ల, విదేశీ ద్రవ్యానికి ఇబ్బంది ఎక్కువగా ఉన్నందువల్ల ఈ పర్యటన ప్రయోజనకారి అనుకోవాలి. ముఖ్యంగా సుహృద్భావ రాయబారం వంటి దనుకోవాలి.

ప్రతినిధివర్గంలో యీ క్రిందివారున్నారు. శ్రీయుతులు జి. డి. బిర్లా, బాబూభాయ్ యం. చినాయ్, కస్తూర్భాయ్ లాల్భాయ్, మదనమోహన ఆర్. రూయా, రామనాథ్ ఎ. పోదార్, శ్రీ యాంసప్రసాద జైన్, యస్. యల్. కిర్లోస్కార్, సి. హెచ్. భాభా, బి. డి. గర్వారే, డి. పి. గోయంకా, యస్. యస్. కనోరియా, మదనమోహన మంగళదాస్, ఆర్. వెంకటస్వామి నాయుడు, భారత వాణిజ్య పారిశ్రామికమండలి కార్యదర్శి శ్రీ బి. యల్. బజాజ్.

# సరిహద్దులపై కేంద్రంతో ఆంధ్ర ముఖ్యమంత్రి సంప్రదింపు

## పటాస్కర్ సిఫార్సులకై సరిహద్దు ప్రజల ఆదుర్దా

మదరాసు, జూలై 29: ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి మదరాసు-ఆంధ్ర సరిహద్దు తగాదా గూర్చి పరిశీలించిన శ్రీ హెచ్. వి. పటాస్కర్ నివేదిక విషయమై కేంద్రప్రభుత్వంతో మాట్లాడుతున్నట్లు తెలుస్తున్నది.

శ్రీ సంజీవరెడ్డి నిన్న సాయంత్రం విమానంలో ఇక్కడికి వచ్చారు.

ప్రభుత్వ అతిథిగృహంవద్ద తిరుత్తణి, పళ్ళూరు ప్రతినిధులు వారిని చూడగా "కొన్ని పత్రికలలో వచ్చిన వార్తను చూచామనీ దాని మీద కేంద్రంతో సంప్రదిస్తున్నామని" ముఖ్యమంత్రి అన్నారు.

మాకు మహా అన్యాయం జరిగిపోతోందని సరిహద్దు ప్రతినిధులు చెప్పగా "న్యాయం ఎక్కడ వుంది" అని ముఖ్యమంత్రి చెప్పారు.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు "ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సరిహద్దు ప్రాంతాలుగూర్చి చేయవలసినదంతా చేసింది. చెప్పవలసిందంతా చెప్పింది. శ్రీ పటాస్కర్ ఈ సమస్యను పరిశీలించి తమ అభిప్రాయం చెప్పారు. నిర్ణయం తీసుకోవలసింది కేంద్ర ప్రభుత్వం. వారు ఆంధ్ర, మదరాసు రాష్ట్రముఖ్యమంత్రులతో సంప్రదించిన మీదటనే నిర్ణయం తీసుకుంటారనుకుంటాను. ఏమైనా ఏ సమస్యకైనా ఎక్కడో అక్కడ అంతం అంటూ వుండాలిగదా" అని అన్నారు.

ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి విమానాశ్రయంనుంచి ప్రభుత్వ అతిథిగృహానికి చేరగానే అంతకు ముందే అక్కడకేచి వున్న సుమారు వందమంది దేశీయ కళాశాల విద్యార్థులు, విద్యార్థినులు ముఖ్యమంత్రికి పూలమాలవేసి జయధ్వానాలతో స్వాగతం చెప్పారు.

### దేశీయకళాశాల విద్యార్థుల కోరిక

"ఏం మీరంతా ఇల్లా వచ్చారు" అని ముఖ్యమంత్రి అనగా మిమ్మల్ని మా కాలేజీకి తీసుకొని వెడదామని వచ్చామని విద్యార్థులన్నారు. దేశీయ వైద్యకళాశాలలో రెండువందలమంది వరకు తెలుగు విద్యార్థులున్నారని కొన్ని విషయాలు చెప్పుకోవలసి వుందని విద్యార్థులు అన్నారు.

సెప్టెంబరు రెండవవారంలో తప్పకుండా మీ కళాశాలకు వస్తానని శ్రీ సంజీవరెడ్డి చెప్పారు.

ఇకముందు ఆంధ్రనుంచి విద్యార్థులు రారుగా అన్నారు.

రాష్ట్ర పునర్నిర్మాణచట్టం సెక్షన్ 118 ననుసరించి ఆ చట్టంలో ఆరవ అనుబంధంలో ఉదహరించిన సంస్థలలో అవి నూతనరాష్ట్రంలో వున్నా, ప్రస్తుతరాష్ట్రంలో వున్నా, ఆంధ్ర ప్రదేశ్ లోవున్నా, మదరాసు రాష్ట్రములోవున్నా కేంద్రప్రభుత్వం ఉత్తరువుద్వారా సూచించిన సౌకర్యాలను ఇరుగు పొరుగురాష్ట్రాల ప్రభుత్వాలకు, ప్రజలకు, 1957 మార్చి 31 లోగా రాష్ట్రప్రభుత్వాలు చేసుకునే ఒప్పందం ప్రకారం కలుగజేయాల్సి వుంది. అలాంటి ఒప్పందం ఏమీ జరగని పక్షములో కేంద్రప్రభుత్వమే ఉత్తరువుద్వారా నిర్ణయిస్తుంది. అయితే ఆంధ్ర ప్రభుత్వం దేశీయ వైద్యకళాశాలలకు విద్యార్థులను పంపకూడదని నిశ్చయించినట్లు తెలుస్తుంది.

అదీగాక దేశీయ వైద్యకళాశాలలో చదివి వైద్యంచేస్తున్నవారు, ఇంకా చదువుకుంటున్న విద్యార్థులు తెలుగువారువున్నారు. మదరాసురాష్ట్రంలో దేశీయ వైద్య కళాశాల పట్టభద్రులకు కొన్ని సౌకర్యాలు కల్పిస్తూ, ప్రత్యేకంగా ఒక శాసనం వుంది. అల్లాంటి శాసనం ఆంధ్రప్రదేశ్ లో కూడా ఉండాలని కోరిక ఒకటి ఉంటుంది. ఈ విషయాలను వివరంగా తెలుపుకొనుటకు దేశీయకళాశాల విద్యార్థులు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిని తమ కళాశాలకు రావలసిందని కోరారు.

శ్రీ నీలం సంజీవరెడ్డి, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు అల్లూరి సత్యనారాయణరాజు ఇవాళ ఉదయం విమానంలో బయలుదేరి హైదరాబాదు వెళ్ళారు.

## పాకిస్తాన్‌లో భారత్ హైకమిషనర్

### రెండు నెలలపాటు విదేశయాత్ర

కరాచీ, జూలై 28: పాకిస్తానులో భారత్ హైకమిషనర్ శ్రీ సి. సి. దేశాయ్ భార్యతో, కూతురుతో నేడు విదేశయాత్రకు బయలుదేరారు.

శ్రీ దేశాయ్ రెండు నెలలు సెలవు పుచ్చుకున్నారు. ఈ సెలవుల్లో పశ్చిమ ఆసియాల్లో దేశాల్లోను, రష్యా, తూర్పు యూరోపు రాజ్యాలలోను పర్యటిస్తారు.

ఈయన సెలవులో వున్నంతకాలం డిప్యూటీ హైకమిషనరు శ్రీ డి. ఎన్. ఛటర్జీ, హైకమిషనర్ పనులుచేస్తారు.

కౌసా, ఉత్తర రోడీషియా జూలై 27 : రోడేషియా సమాఖ్యకు 1960లో పూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించేట్లు తమ ప్రభుత్వం బ్రిటన్‌ను ఒత్తిడి చేస్తుందని, ఆ సమాఖ్య ప్రధానమంత్రి సర్ రాయ్ వెలెన్‌స్కీ నేడు విశదం చేశారు.

## అణ్వస్త్ర పరీక్షల నిషేధం

### బ్రిటిష్ కార్మిక సమాఖ్యకు తీర్మానాలు

లండన్, జూలై 29: అణ్వస్త్ర పరీక్షలను వెంటనే నిలిపివేయాల్సిందనీ, అణ్వస్త్రాలనిర్మాణాన్ని నిషేధించడానికి తగు చర్యలు తీసుకోవాలనీ, ప్రభుత్వానికి, అంతర్జాతీయ సామ్యవాద ఉద్యమ నాయకులకూ సూచిస్తూ, బ్రిటన్‌లో కొన్ని కార్మిక సంఘాలు, సెప్టెంబరు బ్లాక్ పూల్ బ్రిటిష్ సర్వకార్మికసంఘ సమాఖ్య వార్షికసమావేశానికి, తీర్మానాలను ప్రతిపాదిస్తున్నాయి.

సమాఖ్య వార్షికసమావేశానికి, అంతర్జాతీయ వ్యవహారాలగురించి వచ్చిన మొత్తం ఏడుతీర్మానాలలో అయిదు అణ్వస్త్రపరీక్షల నిషేధానికి సంబంధించినవే.

## సంపాదకునకు లేఖలు

### బాపట్ల పశువైద్య కళాశాలను తరలించవద్దు

ఆర్యా, శ్రీకాకుళంనుంచి నెల్లూరు వరకూ ఉన్న జిల్లాలనుంచి పశువైద్య విద్య నభ్యసించే విద్యార్థులు ఎక్కువ. బాపట్లలోని పశువైద్య కళాశాలను తిరుపతికి తరలిస్తే ఈ విద్యార్థులకు ఖర్చు హెక్కువవుతవి; తల్లిదండ్రులు భరించలేరు. బాపట్లలో వ్యవసాయ కళాశాల ఇదివరకే ఉన్నది. పశువైద్య కళాశాల ఏర్పాటయి రెండు సంవత్సరాలయింది. రైతుకు వ్యవసాయమూ పశువైద్యమూ కూడా అవసరమే. బాపట్లలోని పశువైద్య కళాశాలను తిరుపతికి తరలిస్తే ఈ ప్రాంతంనుంచి వెళ్లే విద్యార్థులకు అంత అనుకూలంగా ఉండదు.

గుంటూరు, కాకెపల్లి వరమానందం.

* * *

### అమలాపురం, ఊబ్బ, పుల్లంకుర్రు దుర్రో

ఆర్యా, రోజూ ఎనిమిది 'సర్వీసు' బస్సులు తిరుగుతూ అనేక జట్కాబండ్లు, తిరుగుతూ పందలాది ప్రయాణీకులు తిరిగే ఈరోడ్డు చాలాకాలం నుంచి మరమ్మతు లేక మోకాటిలోతు గోతులుపడి రోడ్డుమీద సైకిళ్ళుకూడా తిరుగడానికి చాలా అవస్థగా ఉంది. గర్భిణీస్త్రీలు ఈ గోతుల్లో బస్సులు ఎక్కడానికి చాలాభయపడుతున్నారు. ఆఖరికి ఎద్దులబళ్ళు, జట్కాలు కూడా తిరగడానికి చాలా ప్రమాదంగా ఉంది. ముగ్గురు శాసనసభ్యులు గతకాలంలో ఒక్కరూ కూడా ఈ రోడ్డుని గురించి శ్రద్ధ తీసుకొనకపోవడం ప్రజల దురదృష్టమే అనాలి, ఇలా ఈరోడ్డు ఈ వర్షాకాలం మరమ్మత్తు లేకుండా ఉంటే వేలాది ప్రయాణీకులు ప్రయాణాలకి ఆటంకంగా ఉంటోంది. ఈరోడ్డును బాగుచేయించి ప్రజల రాకపోకలకు ఇబ్బంది కలుగకుండా చేయవలసినదిగా కోరుతున్నాను.

అయినాపురం, కె. ఎల్. ఎన్ శాస్త్రి.

* * *

### హైదరాబాదులో తెలుగు టైపు పరీక్షా కేంద్రం

ఆర్యా, విశాలాంధ్ర ఏర్పడి దాదాపు తొమ్మిది మాసములు కావస్తున్నా ఆంధ్ర, హైదరాబాదు సాంకేతిక పరీక్షా సంస్థలను కలిపివేసి యావదాంధ్రకు ఒకే బోర్డు ఆధ్వర్యాన పరీక్షలు జరిపేందుకు ఇంతవరకు ప్రభుత్వం పూనుకొనలేదు. ఆంధ్రప్రాంతంలో టైపురైటింగు పరీక్షా విధానానికి హైదరాబాదులో టైపురైటింగు పరీక్షా విధానానికి చాల వ్యత్యాసమున్నది. ఆంధ్రలో థియరీ పరీక్షలో ఉత్తీర్ణులు అయిన తరువాత మెకానిజం పరీక్షలో కూడ విధిగా ఉత్తీర్ణులు కావాలి. మెకానిజం తప్పితే మొత్తం పరీక్ష పోయినట్లుగానే పరిగణిస్తారు. హైదరాబాదులో అసలు మెకానిజం పరీక్ష లేనే లేదు. అంతేగాక టైపు రైటింగు రెండవపత్రం ఆంధ్ర సాంకేతిక బోర్డువారికంటే హైదరాబాదుదే తేలికగా వుంటుంది. అందుచేతనే హైదరాబాదు టైపు పరీక్షలను ఆంధ్రలో మొన్న మొన్నటి వరకు గుర్తించలేదు. ఈ రెండు సాంకేతికబోర్డులను కలిపి వేస్తే ఈ వ్యత్యాసములు తొలగిపోగలవు.

ఆంధ్రప్రాంతంలో ఇంగ్లీషు టైపురైటింగు పరీక్షలతోపాటు తెలుగు టైపురైటింగు పరీక్షలను కూడ నిర్వహిస్తున్నారు. అందువలన అనేకమంది తెలుగు టైపురైటింగు నేర్చుకొని పరీక్షలకు హాజరవుతున్నారు. కాని హైదరాబాదులో తెలుగు టైపురైటింగు పరీక్షలను నిర్వహించటంలేదు. హైదరాబాదు నగరం ఆంధ్రప్రదేశ్ రాజధాని అయినది గనుక ఇప్పుడైనా హైదరాబాదులో తెలుగు టైపురైటింగు పరీక్షలను నిర్వహించకపోవడం చాల శోచనీయమైన విషయం. ఇక్కడ తెలుగు టైపురైటింగు నేర్చుకోవడానికి అనేక మంది ఉత్సాహపడుతున్నారు. కాని ఇక్కడ పరీక్షాకేంద్రం లేకపోవడం చేత, ఒకవేళ నేర్చుకున్నా విజయవాడకో వెళ్లి పరీక్ష ఇవ్వవలసి రావడం చేత చాల చిక్కుగా వుంది. ఆంధ్ర, హైదరాబాదు బోర్డులను కలిపివేసే కార్యక్రమం కొంత ఆలస్యమైనా ఈలోగా కనీసం హైదరాబాదు నగరంలో నైనా తెలుగు టైపురైటింగు పరీక్షాకేంద్రాన్ని ఏర్పాటు చేయవలసినదిగా కోరుతున్నాను.

హైదరాబాదు, కె. అమరసుందర్.

## 'చేలో నీటిని తీస్తారా? దావా వేయమా?'

### ప్రభుత్వానికి ఒరిస్సా రైతు తాఖీదు

బొంబాయి జూలై 27 : 'నా పొలాలకు పారించిన నీటిని తీసివేస్తారా? లేకపోతే దావా వేయమంటారా?' అని ఒరిస్సాలో ఒక రైతు ప్రభుత్వానికి తెలియబరచాడు.

దేశంలో నీటిపారుదల వసతులు అపరిమితంగా ఉన్నాయనీ, కాని నీటి వినియోగం బహు స్వల్పంగా మాత్రమే జరుగుతున్నదనీ చెప్తూ, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి శ్రీ యస్. కె. పాటిల్ యీ విషయాన్ని తెలియజేశారు.

